అమెరికా పర్యటనను ముగించుకొని లండన్ తిరిగివచ్చిన భారత ప్రధానమంత్రి ట్ నెహ్రూకు నవంబరు 9 న ఇండియాలీగ్‌వారు చేసిన సన్మానానంతరం ట్ నెహ్రూ బయటికి వచ్చేస్తున్నారు. ఐ. యన్. పి.

నెహ్రూ ఈ 9 న బ్రిటిష్ ప్రధాని అట్లీతో విందారగించి వస్తూండగా అట్లీ సతి వీడ్కోలిస్తున్న దృశ్యం. —ఐ. యన్. పి.

నవంబరు 7 వ తేదీన రాష్ట్రం అంతటా పలుచోట్ల రాష్ట్రకాంగ్రెస సంఘ అధ్యక్షుడు ఆచార్య రంగాగారి జన్మదినోత్సవం జరిగింది. 50 జతల ఎడ్లబండిపై రంగాగారి చిత్రపటాన్ని అమర్చి గుడివాడలో ఈ సందర్భంలో ఊరేగింపు జరిగింది. అడుసుమల్లి వెంకటసుబ్రహ్మణ్యంగారు అధ్వర్యం వహించారు. ఆ సందర్భంలో తీసిన ఫోటో.

ప్రధానామాత్యుడు శాన్‌ఫ్రాన్‌సిస్కో ప్రెస్‌క్లబ్బు ఆతిథ్యం స్వీకరించిన ం. ఆయన పడిచేతివైపున క్లబ్బు అధ్యక్షుడు కూర్చున్నారు. ఐ. యన్. పి.

లార్డు మేయరు విందు దృశ్యం: పండిట్ నెహ్రూ (గాంధీటోపీ) ఎదురుగావున్న వరుసలో ఎడమవైపున వున్నారు. ఐ. యన్. పి.

విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలోని భారతీయ విద్యార్థులు ప్రధానామాత్యుని చుట్టూచేరి ప్రసంగించిన దృశ్యం. ఐ. యన్. పి.

నామాత్యుడూ, ఆయనపుత్రికా చికాగోలోని సైన్సు, ఇండస్ట్రీ మ్యూజియంలో, టెలిఫోన్ సంభాషణల రికార్డులను వింటున్న దృశ్యం. యు. యస్. ఐ. యస్.

లండన్ కొత్త లార్డు మేయరు సర్ ఫ్రెడరిక్ హాలెండ్ 9 వ తేదీ చేసిన వార్షిక విందుకు పండిట్ నెహ్రూ హాజరైనారు. లార్డు మేయర్ భారత ప్రధానమంత్రికి స్వాగతం చెప్తున్నారు. —ఐ. యన్. పి.

పశ్చిమగోదావరిజిల్లాలో తుఫాను, వరదలకు గురియైన ఆముదాలపల్లి, మొగలపల్లి.

ప్రధానామాత్యుడూ, ఆయన పుత్రికా, అమెరికా అధ్యక్షుడు హారీ ట్రూమన్ విమానం కింది పెంటగన్స్‌లో లండన్ బయలుదేరబోతూండగా లాగార్డియా నాశ్రయంలో తీసిన ఫోటో. ఐ. యన్. పి.

నెహ్రూకు శాన్‌ఫ్రాన్సిస్కో పౌరులు విందుచేసిన సందర్భపు చిత్రం. శ్రీమతి విజయలక్ష్మి ప్రక్కను ఆహ్వానసంఘ అధ్యక్షుడు గెయిన్స్ జరో, నెహ్రూతో మాట్లాడుతున్నామె గెయిన్స్ జరో సతి, అవతలివారు ఫ్రిస్కో మేయరు, ఆయన సతి. ఐ. యన్. పి.

ప్రధానామాత్యుడు నవంబరు 7-వ న్యూయార్కునుంచి లండన్ బయలుదేరడానికిముందు అమెరికా పత్రికాప్రతినిధులతో వీడ్కోలు ప్రసంగం చేసిన దృశ్యం. ఐ. యన్. పి.

# మాటుపడ్డ ధనం పెట్టుబడికి వినియోగపడేటట్లు చేయడానికి భారతప్రభుత్వ పథకం

## కేంద్రపారిశ్రామిక సలహాసంఘ స్థాయిసంఘసభలో పారిశ్రామికులకు సర్దార్ పటేల్ విజ్ఞప్తి

### ఉత్పత్తిని అధికంచేస్తేగాని ప్రస్తుత ఆర్థిక సమస్యలేవీ పరిష్కారంకావని ఉద్ఘాటన

న్యూఢిల్లీ, నవంబరు 12: కేంద్ర పారిశ్రామిక సలహాసంఘం తాలూకు స్థాయీసంఘ ప్రథమ సమావేశంలో భారత ఉపప్రధాని సర్దార్ వల్లభాయ్‌పటేలు ఈవేళ ఉపన్యసిస్తూ, ప్రస్తుత ఆర్థిక దుస్థితిని తరించాలంటే వ్యవసాయోత్పత్తిని పారిశ్రామికోత్పత్తిని అధికతరం చేయడమేగాక వస్తువుల ధరలను బాగా తగ్గించివేసి దిగుమతులను పరిమితంచేయవలసిన అవసరంకూడా వున్నదని నొక్కివక్కాణించెను.

పెట్టుబడిదారులు గుప్తధనాన్ని వెలికి తీసి నూతన పరిశ్రమలను స్థాపించడంలోను, ప్రస్తుత పరిశ్రమలను అభివృద్ధిచేయడంలోను ఆ ధనాన్ని వినియోగించవలెననీ, కార్మికులు దేశశ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని ఒళ్లువంచి పనిచేయవలెనని, సర్దార్ పటేలు విజ్ఞప్తిచేసెను. గుప్త ధనాన్ని బైటపెడితే, ఆదాయపు పన్ను చెల్లించలేదన్న నేరం కింద అనవసరంగా ఇరుక్కుంటామేమోనని సంకోచిస్తున్న వారికి కొన్ని రక్షణలు కల్పించడం అవుతుందని కూడా సర్దార్ పటేలు చెప్పెను. పారిశ్రామికశాఖామంత్రి డాక్టరు శ్యామప్రసాద్ ముఖర్జీ ఈ సమావేశమునకు అధ్యక్షత వహించెను.

సర్దార్ వల్లభాయ్‌పటేలు ఉపన్యాస పాఠం ఇది:—"మిత్రులారా, అత్యంత ప్రధానమైన కొన్ని విషయాల గురించి మీ ఎదుట ప్రసంగించుటకు నాకు ఈ అవకాశం ఇచ్చినందుకు డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీకి నా కృతజ్ఞత తెలుపుకొనగోరుతున్నాను. భారతదేశాన్ని ఈ నాడు ఎదుర్కొంటున్న తీవ్రమైన ఆర్థికదుస్థితిని తొలగించడానికి సాధనోపాయాలు వెదకడానికి మీ రిక్కడ సమావేశమైనారు. శతాబ్దాలుగా వెనకబడియున్న స్వదేశపరిశ్రమలను కొలది సంవత్సరములలో అభివృద్ధిచేయుట దుష్కరం. ప్రస్తుతస్థితిలో, దేశాన్ని హఠాత్తుగా వ్యావసాయిక వ్యవస్థలోంచి పారిశ్రామిక వ్యవస్థలోకి మార్చగల బృహత్ పథకం ఏదీ సంభవం కాదు. ఏమంటే, యూరపులో పారిశ్రామిక విప్లవం సమాప్తమై, కార్మికులకు పారిశ్రామికులకు వినియోగదారులకు ఉండవలసిన పరస్పర సంబంధ బాంధవ్యాలగురించి ప్రపంచ పరివ్యాప్తంగా కొన్ని స్థిరమైన, అభిప్రాయాలు ఏర్పడినతర్వాతనే మన దేశంలో పారిశ్రామికాభివృద్ధి ప్రారంభమైంది.

మన పారిశ్రామికాభివృద్ధికి ఎన్ని విధాల ఆటంకాలు కలగాలో అన్ని విధాల ఆటంకాలు సంభవించినవి. అయినా మన పెట్టుబడిదారులు తమచేతిలో ఉన్నంతవరకు పారిశ్రామికాభివృద్ధిని సాధించడానికి ప్రయత్నించిరి. అయితే పారిశ్రామికాభివృద్ధికి దోహదం చేసే పరిస్థితులు కూడా కొన్ని ఉండి ఉండకపోలేదు. భారతదేశంలో జాతీయశక్తుల విజృంభణ, ప్రపంచ సంగ్రామాలు పారిశ్రామికులకు అనుకూలంగా పరిణమించినవి. దేశంలో ప్రస్తుతం తీవ్రమైన ఆర్థిక దుస్థితి ఏర్పడియున్నది. యుద్ధకాలంలో మనం వెనుక వేసుకున్న స్టెర్లింగు నిల్వలు ఇంచుమించు హరించుకొనిపోయినవి. యుద్ధానంతరం ప్రారంభమైన ద్రవ్యోల్బణం ఇంకా తగ్గలేదు. విదేశాలతో మన వ్యాపారం చాలా హీనదశలో ఉన్నది. దేశంలో పన్నులభారం విపరీతంగా పెరిగిపోయినవి. ఇందువల్ల ప్రభుత్వానికి ఆదాయం పెరిగినా వాణిజ్య వ్యాపారాలు అప్రతిహతంగా దెబ్బతిన్నవి. కార్మికులకు వ్యవసాయదారులకు ఆదాయాలు పెరగడంవల్ల ద్రవ్యోల్బణం అధికం ఐందేగాని పరిశ్రమలకింద పెట్టుబడి అధికం కాలేదు. ఇంతవరకు పారిశ్రామికాభివృద్ధికి ప్రధానంగా తోడ్పడుతూ వచ్చిన మధ్యతరగతి ప్రజలు దెబ్బతినడంవల్ల పారిశ్రామికాభివృద్ధి బాగా కుంటుపడింది.

ప్రస్తుత ఆర్థికదుస్థితికి హేతుభూతమైన కారణములన్నిటిని పరిశీలించి వాటిని తొలగించడానికి ప్రయత్నించాలి. ధరలు చాలా హెచ్చుస్థాయిలోఉన్నవనీ, వాటిని తగ్గించివేయక తప్పదనీ విస్పష్టం.

మన పారిశ్రామికాభివృద్ధికి ఏ దేశాల కరెన్సీ అవసరమో ఆ కరెన్సీని వీలైనంత పొదుపుగా వాడుకుంటూ సాధ్యమైతే ఇతోధికంగా సంపాదించడానికి ప్రయత్నించాలి. అనవసరమైన వస్తువుల దిగుమతులను పూర్తిగా నిలిపివేయాలి. ఆహారధాన్యాలను కూడా మనకు సరిగా ఎంతవరకు అవసరమో అంతవరకే దిగుమతి చేసుకోవాలి.

మనం హృదయపూర్వకంగా కృషిచేసినట్లయితే ఆహారధాన్యాల లోటును సులభంగా భర్తీ చేసుకోగలమని నా విశ్వాసం. ఆహారధాన్యాల ధరలను బట్టలధరలను తగ్గించి వేయడానికి భారతప్రభుత్వం ఇదివరకే చర్యలు తీసుకున్నది. అయితే ఇప్పుడు చేసిన తగ్గింపు సంతృప్తికరంగా ఉన్నదనిగాని ఈతగ్గింపు సవ్యమైనపద్ధతిలో జరుగుతున్నదనిగాని నేను చెప్పడంలేదు. కృత్రిమమైన నిర్బంధాలద్వారాకన్న సహజమైన పరిస్థితులద్వారా ధరలు తగ్గించడం మంచిది.

విదేశ వ్యాపారంలో ఏర్పడిన లోటును తగ్గించడానికై దిగుమతులను తగ్గించుకోవడమేగాక అభివృద్ధి పథకాల కింద వ్యయాన్ని కూడా తగ్గించివేయవలసి వచ్చింది. ఇక పన్నుల సంగతికి వద్దాము. ఈ విధానం ఏటేటా నిర్ణయించబడుతూ ఉంటుంది. వచ్చే బడ్జెటులో మన ఆర్థికమంత్రి ప్రస్తుతపరిస్థితిదృష్ట్యా ప్రభుత్వపు పన్నువిధానాన్ని పునస్సమీక్ష చేయగలడని నేను నమ్మకంగా చెప్పగలను. ప్రత్యక్షపుపన్నులను ఇప్పటికన్న బాగా తగ్గించి సరసమైన ప్రమాణానికి తీసుకోరాగలనని ఆర్థికశాఖామంత్రి లోగడ ఇచ్చిన హామీ మనకు గుర్తుండే ఉంటుంది. ప్రస్తుతం దేశంలో విధించబడుతున్న పన్నుల ప్రమాణం దేశఆర్థికవ్యవస్థకుచాలా హానికరంగా ఉన్నదని, ఆర్థికమంత్రి అభిప్రాయపడుతున్న సంగతికూడా మీరందరూ ఎరిగిందే.

మీరు ఈ ప్రకటనలనునమ్మి మీమీ భవిష్యత్కార్యక్రమములను దీనికి అనుగుణంగా రూపొందించుకోగలరని విశ్వసిస్తున్నాను. మీరు ఇంతకాలము చాలా గురుతరమైన భారాన్ని మోస్తూవచ్చారు. కాని ఈ భారం త్వరలోనే తగ్గిపోగలదన్న విశ్వాసం మిమ్ము ఉత్సాహపరచి కొత్త కార్యక్రమాలకు పురికొల్పగలదని ఆశిస్తున్నాను. పోతే ఈ సందర్భంలో ఇంకో విషయముకూడా ప్రస్తావించవలసి యున్నది. ఆదాయపుపన్ను చెల్లించకుండా డబ్బు రహస్యంగాదాచి ఉంచుతున్నారు. ఒకసంగతి గమనించాలి. ఆదాయపుపన్ను ఎగవేయడం నైతికంగా దోషం అవడమేగాక స్వార్థదృష్ట్యాకూడా ఈ అలవాటు చాలా హానికరం. ఎందుచేతనంటే, ఈధనం ప్రతిఫలరహితంగా పడిఉండవలసి వస్తుంది. దేశ ఆర్థికస్థితి సౌష్ఠవంగా ఉంటేనే దాచుకున్న ధనానికి విలువఉంటుంది; ఒకటి చెడిపోతే రెండోది నిరుపయోగం.

ఏది ఏమయినాదేశాన్ని ఎదుర్కొంటున్న ప్రస్తుత ఆర్థికదుస్థితికి శాశ్వతమైన ప్రతిక్రియలు జరపవలెనేగాని తాత్కాలికోపశమన చర్యలు జరిపి ప్రయోజనం లేదు. కాబట్టి వస్తూత్పత్తిని అధికం చేయడమే పరమోత్తమమైన సాధనోపాయం. దేశంలో ఉన్న పారిశ్రామిక సంస్థల విస్తృతిని, గడచిన ఒకటి రెండేళ్లుగా దేశంలో అసలు జరిగిన ఉత్పత్తిని పోల్చిచూస్తే, అభివృద్ధికి ఇంకా ఎంత అవకాశం ఉన్నదీ బోధపడుతుంది.

ఉక్కు, బట్టలు, పంచదార, విద్యుత్‌శక్తి పరికరములు, రసాయనపదార్థాలు, యంత్రపరికరాలు, కాగితం, సిమెంటు పరిశ్రమలలో ఉత్పత్తిని బాగా అభివృద్ధి చేయడానికి అవకాశం వున్నదని, ఈ అంకెలను పరిశీలించిన మీకందరికి నిశ్చితమైన అభిప్రాయం కలిగింది. ఇది అవాస్తవికమైన అభిప్రాయమో లేక యథార్థమైనదో మీరే తేల్చి చెప్పాలి. ఈ వివిధ పరిశ్రమలలోను ఉత్పత్తిని గరిష్ఠం చేయడానికి సాధనోపాయాలు సూచించవలసిందని విజ్ఞప్తి చేస్తున్నాను. ప్రభుత్వమూ పారిశ్రామికులూ ఈ మహత్తరమైన జాతీయలక్ష్యాన్ని సాధించడంలో పరస్పరము సహకరించుకోగలరని విశ్వసిస్తున్నాను. లేదా ఈ సమస్యలను తక్షణం పరిష్కరించవలసిన ఆవశ్యకతను గమనించి సాధ్యమైనంత త్వరగా సాధనోపాయములను ప్రతిపాదించగలరు. ఈ కార్యక్రమాన్ని స్థిరీకరించడంలో నేను కూడా నాచేతనైనంతా తోడ్పడతాను. ఈ రెండు రోజులు ఇతర పనులన్నీ చాలించుకొని పారిశ్రామిక శాఖామంత్రితోనే గడపడానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఆర్థిక సమస్యను పరిష్కరించాలంటే, ఆహార స్వయం సమృద్ధి సాధించడమేగాక, వ్యాపారపంటలుకూడా ఇతోధికంగా మనం పండించాలి. రూపాయి విలువ తగ్గింపు జరిగిన తర్వాత ఈ విషయం నాకు వెనుకటికంటె స్పష్టంగా విశదమైంది. పత్తి జనుముతో తయారుచేసే వస్తువులకు విదేశాలలో చాలా గిరాకి ఉన్నది. విదేశద్రవ్యాన్ని సంపాదించడానికి మనచేతిలోఉన్న ఈ సాధనోపాయాన్ని మనం పూర్తిగావినియోగించుకోవాలి. నూతన పరిశ్రమల స్థాపన విషయమైకూడా మీరు ఒక సమగ్రమైన కార్యక్రమాన్ని చేయవలసి ఉన్నది. స్వల్పకాలంలో ఆచరణ సాధ్యమయ్యేవంటన్నీ దీర్ఘకాలావసరములకు కూడా ఉపకరించగలట్టి కార్యక్రమాన్ని మీరు తయారుచేయాలి. ఇటువంటి కార్యక్రమాన్ని మీరు తయారుచేసినట్లయితే, జాతీయ పునరుద్ధరణకై ప్రభుత్వమూ పారిశ్రామికులు కార్మికులూ అందరూ ఇందులో హృదయపూర్వకంగా పాల్గొని ఆత్మసంతృప్తి పడటానికి అవకాశం కలుగుతుంది. నేను మీ సహాయ సహకారములను సగౌరవంగా హృదయపూర్వకంగా అర్థిస్తున్నానని మీరు విశ్వసించాలి."

పెట్టుబడిని ప్రోత్సహించడానికి ప్రభుత్వం తీసుకున్న చర్యలగురించి ప్రస్తావిస్తూ పటేలు ఇట్లు చెప్పెను:—

"నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లకై ప్రచారమును ఇటీవల తీవ్రతరం చేయడమైనది. గ్రామప్రాంతములలో బాంకింగ్ సౌకర్యములను అభివృద్ధిచేయడానికి సాధనోపాయములు సూచించగలందులకై ఇటీవలనే ఒక కమిటీని నియమించడమైనది. ఇంతేగాక, కేంద్రప్రభుత్వ ఉద్యోగుల జీతాలు తగ్గించి నిర్బంధ సేవింగ్సు విధానమును వర్తింప జేయడానికి నిశ్చయించడమైనదన్న సంగతికూడా మీరు ఇటీవల పత్రికలలో చదివే ఉంటారు. ఈ నిర్బంధ సేవింగ్సు విధానమును ప్రజానీకంలోని ఇతరవర్గాలకు కూడా వర్తింపచేసి ఈ విధంగా పొదుపు అయేధనాన్ని పారిశ్రామికాభివృద్ధికి వినియోగించాలి. డబ్బు నిలవ ఉన్నవారందరూ తమ ధనాన్ని పరిశ్రమల అభివృద్ధికింద వినియోగించాలి. ఈ జాతీయ విపత్పరిస్థితిలో ఇదే ఉత్తమమైన దేశసేవ. గుప్తధనాన్ని వెలికితీసి పరిశ్రమల కింద విరివిగా పెట్టుబడి పెడితే, ఆదాయపుపన్ను ఎగవేత నేరంకింద ఎక్కడ ఇరుక్కుంటామోనని అనేకమంది భయపడుతున్నారు. ఈ భయాలను తొలగించి, పెట్టుబడి పెట్టేవారు తమ పేర్లను ఎవ్వరికీ తెలియనివ్వకుండా ఆత్మగోపనం చేసుకోడానికి వీలుగా వారికి తగిన రక్షణలు కల్పించాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

ఈ ఉపన్యాసాన్ని చాలించే ముందు కార్మికులకు ఒక చిన్న విజ్ఞాపన చేయగోరుతున్నాను. కార్మికులు స్వయంగా ముందుకువచ్చి స్వార్థత్యాగం చేయవలసిన తరుణం ఇది. ఇతరులు తమవలె స్వార్థత్యాగం చేయక పోయినట్లయితే, ఆ చేయనివారిని దండించి దారికి తీసుకోరావడం ఎలాగో ప్రభుత్వానికి తెలుసును. ఇప్పుడు కార్మికనాయకులని పిలువబడుతున్న నాయకులకన్న కార్మికులతో నాకే ఎక్కువ గాఢ పరిచయం ఉన్నదని నేను చెప్పగలను. ఆ జనగణమన నాయకుడైన గాంధీ మహాత్ముని కింద నేను పని చేశాను. కార్మికులకు యజమానులకు ఉండవలసిన సంబంధాలగురించి, నాయకత్వ సాధనకు ఆయన నిర్దేశించిన అహింసా పద్ధతులగురించి అందరికీ తెలుసును.

ఈ పద్ధతులద్వారా కార్మికులు తమ లక్ష్యాలను జయప్రదంగా సాధించగలరను [illegible] సందేహం లేదు. కార్మికులు గాంధీజీ సూత్రాలను దృష్టిలో ఉంచుకొని వాటిపట్ల అచంచలమైన విశ్వాసంతో కృషిచేయాలి. పనికి [illegible] పనిచేయకుండా [illegible] నష్టకరమని గుర్తించాలి. ప్రస్తుతస్థితిలో ఎవరు ఎక్కువగా ఉత్పత్తిచేస్తే దేశానికి వారంత సేవచేసినవారు అవుతారనీ, ఉత్పత్తిని నిరోధించేవారే దేశశత్రువులలో అధమాధములనీ ప్రతి కార్మికుడు గమనించాలి. దేశాన్ని ఎదుర్కొంటున్న ఆర్థికదుస్థితిని మనస్సుకు పట్టించుకొని పారిశ్రామికులు, పెట్టుబడిదారులు, కార్మికులు ఈ సమస్యా పరిష్కారంలో హృదయపూర్వకంగా సహకరించవలెనని విజ్ఞప్తి చేయుచున్నాను. ఇంతవరకు నేను కూడా యథాశక్తిగా దేశసేవ చేశాను. వివిధవర్గాలమధ్య ఐక్యమత్యాన్ని సామరస్యాన్ని సాధించడానికి నేను ప్రధానంగా ప్రయత్నించాను. ఈ ఐకమత్యాన్ని పదిలపరచి రక్షిస్తూ ఉండడంకూడా నా కర్తవ్యంగానే నేను పరిగణిస్తున్నాను. ఈ కర్తవ్య నిర్వహణలో జాతి, మత, వర్గ విచక్షణలేకుండా అందరు నాకు తోడ్పడవలెనని మనవి చేస్తున్నాను."

## సలహాసంఘ సమావేశం వివరాలు

న్యూఢిల్లీ, నవంబరు 12: నేడు పరిశ్రమల కేంద్ర సలహా మండలియొక్క స్థాయి సంఘం వారు తమ తొలి సమావేశంలో, పారిశ్రామిక సమస్యలను పరిశీలించి ప్రభుత్వానికి 6 మొదలు 9 నెలలలోగా సలహాలిచ్చి సూచనలు చేయడానికి గాను వర్కింగు పార్టీలను నియమించడం విషయమై చర్చించారు. ఉత్పత్తి పెంచడమూ, ఉత్పత్తిఖర్చు తగ్గించడమూ, కార్మిక దక్షతా నిర్వహణ దక్షతా హెచ్చించడమూ విషయమై కూడా చర్చలు జరిగినవి.

పరిశ్రమలలో అవసరాన్ని మించి అదనంగా ఉన్న కార్మికులను తొలగించడం గురించి చర్చ జరిగింది గాని, దీనికి పారిశ్రామిక ప్రతినిధులు అనుకూలంగానూ కార్మిక ప్రతినిధులు ప్రతికూలంగానూ ఉండడంచేత దీనిపై ఎట్టి నిర్ణయమూ జరుగలేదు.

వర్కింగు కమిటీలో పరిశ్రమయొక్క ప్రతినిధు లిద్దరూ, ఆ పరిశ్రమకు సంబంధించిన కార్మిక ప్రతినిధు లిద్దరూ ప్రభుత్వ నియోజితు లిద్దరూ ఉండి, సమస్యలను సమగ్రంగా చర్చించి, ఉన్నంతలో యంత్రాలు అత్యధిక ఉత్పత్తి చేసేటందుకున్నూ, కార్మిక దక్షత అభివృద్ధి అయేటందుకున్నూ, నిర్వహణ సమర్థంగా ఉండే టందుకున్నూ తగిన శిఫార్సులు చేయాలని సూచించబడింది. ఈవర్కింగు పార్టీలు దేశీయ, విదేశీయ నిపుణుల సలహాలు తీసుకొనవచ్చును. ప్రత్యేక సమస్యలను చర్చించడానికి ఉపసంఘాలు నియమించవచ్చును. ఇవి వేతనాలు, డివిడెండులు మొదలైన సాధారణ సమస్యల జోలికి పోవు. ప్రస్తుతం జౌళ్లు, నేతపరిశ్రమలకే ఇవి ఏర్పాటు చేయబడనున్నవి. వీటి అనుభవంతో ఇతరపరిశ్రమలలో కూడా ఇవి ఏర్పరచ బడగలవు.

ఈ వర్కింగు పార్టీలు ఉత్పత్తి ఖర్చు తగ్గించడానికి దీర్ఘకాల నిర్ణయాలుచేసే సమయంలో, జీవితావసరాలనుఉత్పత్తిచేసే ప్రధాన పరిశ్రమల ఉత్పత్తి హెచ్చింపు విషయంలో గరిష్ఠఉత్పత్తి ప్రమాణాలు నిర్దేశించాలనీ, దీని కొరకు ఉత్పత్తిదార్లతో కూడిన ఒక సంఘమూ, శ్రామికులతో కూడిన మరొక సంఘమూ ఏర్పాటుచేసి ఉత్పత్తి హెచ్చించడానికి ఉత్పత్తి నిరోధాలు తొలగించడానికి ఈ సంఘాలను ఉపయోగించాలనీ, ఈ సంఘాలు ప్రభుత్వం వారికి ప్రతినెలా నివేదికలు పంపాలనీ ఉత్పత్తిఅభివృద్ధికిగల అవాంతరాలనుగురించి, ప్రభుత్వానికి తెలుపుతూ, సాధ్యమైనంత త్వరలో గరిష్ఠ ఉత్పత్తి ప్రమాణాలు సాధించే బాధ్యత వహించాలనీ సూచించ బడింది. ఉక్కు, నేత, కాగితం, జౌళ్లు మొదలైన ప్రధాన పరిశ్రమలలో ఈ సంఘాలు ముందు ఏర్పడగలవు.

స్థాయి సంఘం వారు తిరిగి రేపు ఉదయం సమావేశమై ఇతర విషయాలు చర్చిస్తారు.

## సోమవారం మధ్యాహ్నం బొంబాయికి నెహ్రూ రాక

బొంబాయి, నవంబరు 13: భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ యివ్వాళ రెండుగంటలు ఆలస్యంగా విమానంలో లండన్‌నుంచి బయలుదేరుతున్నారు. పండిట్ నెహ్రూ, సోమవారం మధ్యాహ్నం 2.45 గంటలకు బొంబాయి చేరగలరు. పండిట్ నెహ్రూ సాయంత్రం 4.30 గంటలకు బొంబాయి ప్రభుత్వ భవనంలో పత్రికా ప్రతినిధులను కలుసుకొంటారు. అని బొంబాయిప్రభుత్వ సమాచారశాఖవారు నేడు ప్రకటన చేశారు.

## న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 12:

డిశంబరు 29.92 / 29.93 మార్చి 29.88 / 29.88 మే 29.83 / 29.84 జూలై 29.49 / 29.49 అక్టోబరు 28.05 / 28.05 డిశంబరు 27.98 / నా. మార్చి 27.91 / [illegible] 27.92 [illegible].

| | | |
|---|---|---|
| మిడ్లింగ్ | నవంబరు | 30.52 |
| డిశంబరు | (గరిష్ఠధర) | 29.93 |
| | (కనిష్ఠధర) | 29.90 |

## రేడియో ప్రోగ్రాములు

నవంబరు 15 మంగళవారం

### మద్రాసు (ఎ)

ఉ॥ 7-30 ఎస్. రామయ్య పాట. 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయ సంగీతం రికార్డులు. 8-30 మద్రాసు (బి) వలె. 1-0 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వార్తలు. 1.40 సినిమాసంగీతం రికార్డులు. 4-30 పాశ్చాత్యసంగీతం రికార్డులు. సా॥ 5-30 టి. పి. జయరామనాయుడు వయొలిన్ 6-0 ఆంగ్లమున వార్తలు. 6-20 చిత్తూర్ వి. రామచంద్రన్ పాట. 7-30 గీతమంజరి రికార్డులు. 7-45 టి. [illegible] సంగీతం వేణువు 9-0 ఆంగ్లమున వార్తలు. 9-30 మద్రాసు (బి) వలె. 10-0 వాద్య సంగీతం రికార్డులు.

### మద్రాసు (బి)

ఉ॥ 7-0 తెలుగున వార్తలు. 7-15 రాధ జయలక్ష్మి రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 వి. ఆర్. గజలక్ష్మిపాట. మ॥ 12-0 కార్మికుల కార్యక్రమం. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు ప్రసిద్ధ శాస్త్రజ్ఞులు చేసే ప్రసంగం. వి. డి. ప్రసాదరావు ప్రశ్నలు జవాబులు విసెంట్ థియొసాఫికల్ పాఠశాలావిద్యార్థులు; 1-0 మహిళామండలి మరోప్రపంచం శ్రీశ్రీ గేయం జగద్కుటుంబం. పారస్పర్యము జనసంఖ్య ప్రసంగం విద్యాసంగీతం ఉద్యానవనములో ఏడాదిపూసే పుష్పలతలు ప్రసంగం. 1-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు భర్తృహరి సుభాషితరత్నావళి వ్యాయము పి. గణపతిశాస్త్రి బృందగానము రామకృష్ణ మిషన్ హైస్కూలు విద్యార్థులు. 4-0 ప్రాథమికపాఠశాలావిద్యార్థులకు ప్రయాణ గాథ భూమిమీద ప్రసంగం. వి. లీల మన దేవాలయాలు శ్రీరంగం దేవాలయం: శ్రీ. బి. శర్మ బృందగానము. సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం (రి)6-30 గ్రామస్థుల కార్యక్రమం శివస్తుతి బృందగానము. కవిత. సమకాలిక జీవనము పాల్కురికవిత ప్రసంగం విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణ వివరాలు 7-0 తెలుగున వార్తలు 7-15 సామ్యంకోవా పోలీసులేనిదే శాంతిభద్రతలు ప్రసంగం. శాంతిధర్మంచేది ప్రబోధగీతి 7-45 మద్రాసు (ఎ) వలె 9-30 కె. ఎస్. విశ్వనాథశాస్త్రి పాట10-0మద్రాసు (ఎ)వలె.

### విజయవాడ

ఉ. 7-0 తెలుగున వార్తలు 7-15 అతియనుడి రామానుజయ్యంగార్ రికార్డులు. 7-30 టి. మాణిక్యం నాదస్వరం 8-0 ఆంగ్లమున వార్తలు 8-15 విజయవాడరేడియో ఆర్కెస్ట్రా 8-30 నూకల చినసత్యనారాయణ పాటలు. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1-0 తారాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు సా. 5-30 టి.మాణిక్యం నాదస్వరం 6-0 ఆంగ్లమున వార్తలు 6-20 గీతమంజరి శ్వరలక్ష్మి రికార్డులు 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసునుండి) 7-0 తెలుగున వార్తలు 7-30 కోటిపల్లి ప్రకాశరావు వయొలిన్ 7-45 డి. ఏమెల్ వేణువు ఎలిక్ట్రికల్ రికార్డింగు (ఎ. ఐ. ఆర్ బొంబాయివారి అనుమతితో) 8-0 'గాలిగోపురం' రూపకం రచన టి. కృత్తివాసతీర్థులు 8-30 నూకల చినసత్యనారాయణ పాట 9-0 ఆంగ్లమున వార్తలు 9-15 సారంగినిలయ విద్యాంసుడు 9-30 చిత్రవాణి రికార్డులు.

### హైద్రాబాదు

ఉ. 7 శ్రీమద్భగవద్గీత. పండిట్ రామనివాసశర్మ 7-45 మాణిక్‌రావు భజన్. 8 ఆంగ్లమున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే.) 8-20 శ్రీమద్భగవద్గీత, తెలుగువ్యాఖ్యానం. కె. వి. ఎన్. శాస్త్రి. 8-35 భజనావళి రికార్డులు. 8-50 తెలుగున వార్తలు. 9-15 మాధవరావు ఖయాల్ లలిత్. మ. 12-30 మోహన్‌కి మురళి రికార్డులు. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే.) సా. 5 మహిళామండలి తెలుగున పురుషులతో స్త్రీలకు సమానత్వ ముండవలెనా? (3) సంభాషణ, రచన, ఎం. భాగ్యవతి. 'ఆత్మసంతోషం' నాటిక, రచన, ఎ. వి. సూర్యారావు. [illegible] సావిత్రి సంగీతం. 5-45 మాణిక్యరావు పదం. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. భజన గోష్ఠి, గ్రామప్రబోధం. మూర్తి మూర్తికం. 7 తెలుగున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే.) 7-15 'సరిగమ' రికార్డులతో కూర్చినకథ. రచన, కె. సీతారామయ్య. 7-45 కృత్తివాసతీర్థులతో హాస్యం. (7) [illegible] తెలుగున ప్రసంగం. 7-55 మాణిక్యరావు భజన్. 8-30 [illegible] ఖయాల్. 8-50 మాధవరావు తుమ్రి. 9 ఆంగ్లమున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే.) 9-15 'నలచరిత్రం' సంగీత రూపకం. రచన, కె. వి. ఎన్. శాస్త్రి. 9-55 మాణిక్‌వర్మ ఖయాల్ [illegible]. 10-15 మాణిక్‌రావు భజన్. 10-35 మాణిక్‌వర్మ తుమ్రీ దాద్రా.

